

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంధాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)

## http://ebooks.tirumala.org



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# నహుషుడు

డాక్టర్ కె. సూర్యనారాయణరెడ్డి

తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

వేదకథాభారతి - 5

# నహుషుడు


రచన

డాక్టర్ కె. సూర్యనారాయణరెడ్డి

ప్రధాన సంపాదకుడు

ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య



ప్రచురణ

డాక్టర్ ఐ. వి. సుబ్బారావు, ఐ. ఏ. ఎస్.,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

1999

VEDAKATHA BHARATI - 5

**NAHUSHUDU**

by

***Dr. K. Suryanarayana Reddy***

Chief Editor

***Professor S. B. Raghunathacharya***

First edition 1999

Copies : 10,000

Published by :

***Dr. I.V. Subba Rao, I.A.S.,***
Executive Officer
Tirumala Tirupati Devasthanams
Tirupati

Price :

Printed at
**ANNAPURNA GRAPHICS**
53, (Upstairs) R.S. Gardens
Tirupati ✆ : 30184

# మామాట

**డాక్టర్ ఐ.వి. సుబ్బారావు,** ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

నిత్య సత్యమైన ప్రమాణాలు వేదాలు. మానవజాతి మనుగడకు అడుగడుగునా మార్గదర్శనం చేస్తూ నిస్స్వార్థ బుద్ధితో, త్యాగమయమైన ప్రవృత్తితో తమ తమ జీవితాలను పండించుకున్న ఎందరో మహానుభావుల జీవన వైభవాలు మనకు వేద వాఙ్మయంలో దర్శనమిస్తున్నాయి.

''ఆహా! ఎటువంటి కర్తవ్యదీక్ష! ఎంత విశాలదృష్టి! ఎటువంటి విశ్వకల్యాణభావన! ఎంతటి ధార్మికచేతన!'' అని మనల్ని ఆశ్చర్యపరిచే జీవనవేదం మనకీ వాఙ్మయంలో ప్రత్యక్షమౌతుంది. ఆ వేదనాదాన్ని ఇంటింటా వినిపించాలనే మా ఆకాంక్షకు ప్రతిరూపమే -

**ఈ వేద కథా భారతి.**

వేదకథాభారతిలోని ఎనలేని మానవత్వపు విలువలు ఈ తరాన్ని ప్రభావితం చేయగలిగితే అంతకంటే మాకు ఆనందమేముంటుంది ?

ఈ కథాపుష్పాలను సంపాదించి తీర్చి దిద్ది అందమైన మాలగా రూపొందించిన ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్య గారిని మనసార అభినందిస్తున్నాను.

ఇంత చక్కగా ముద్రించిన అన్నపూర్ణ గ్రాఫిక్స్ వారికి అభినందనలు.

జయతు జయతు భారతీ
వేద కథా భారతీ

❀ ❀ ❀

# మనవి

వేద కథాభారతి.

అంతశ్శత్రువులను అణచివేసి కొన్ని ఆదర్శాలకు, విలువలకు పట్టంకట్టి, ధార్మిక జీవనానికి ప్రాణంపోస్తూ ఈ లోకంలోనే కాక ఇతరలోకాల వారికి కూడా నిండైన మానవత్వమంటే 'ఇది' అని ఆచరణ పూర్వకంగా నిరూపిస్తూ, అందులోని మధురిమలను చవిచూపిస్తూ వేదనాదవిభాసురమైన ఒక జీవన స్రవంతి ఈ గడ్డపై వెల్లివిరిసింది.

జలజలసాగే ఆ అమృత వాహిని వసుంధరను రసమయం చేసింది. సస్యశ్యామలం చేసింది. సుగంధపరిమళాలను వెదజల్లే నందనోద్యాలను వెలయించింది. మానవ సృష్టిలో అరుదైన ప్రమాణాలను కొన్నింటిని నిలబెట్టింది. వాటికి కాలదోషం లేదు. ఆనాటికి, ఈ నాటికి, ఏనాటికైనా మానవతకు గమ్యాన్ని, జీవనానికి అర్థాన్ని పరమార్థాన్ని సాధించడంలో ఆ ప్రమాణాలు చరితార్థాలయినాయి. అలాంటి జీవన చిత్రాలకు పట్టిన అద్దమే ఈ వేదకథాభారతి.

ఒక్కసారి పరిశీలించండి ! ఆ చిత్రరామణీయకతను మంచిమనసుతో దర్శించండి! వారి ఆత్మల ఔన్నత్యాన్ని వారి భావనల ఔచిత్యాన్ని మీరు తప్పక అభినందిస్తారు ! అవి మంచివని తోస్తే అనుసరించచడానికి ప్రయత్నించండి! ఆనందించండి!

ప్రమాథి - నిజజ్యేష్ఠ
బహుళ - సప్తమి
5-7-1999

ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య

# నహుషుడు

సృష్టి ప్రారంభంనుండి గుణకర్మ విభాగానుసారం వర్ణవ్యవస్థ ఏర్పడింది. నాటినుండి క్షత్రియజాతి ఆవిర్భవించింది. క్షత్రియులు మహాబలశక్తి సంపన్నులు. కావుననే వారు పరమాత్మ బాహువులనుండి జన్మించారని పేర్కొనడం జరిగింది. క్షత్రియులు దైవాంశసంభూతులని విశ్వాసం ప్రాచీనకాలంలో ఉండేది. ''నా విష్ణుః పృథివీపతిః'' అనెడి ఆర్ష వాక్యమే ఇందులకు ప్రమాణం.

''క్షతాత్ త్రాయతే ఇతి క్షత్రియః'' ప్రజలను సర్వక్షతముల నుండి కాపాడేవారే క్షత్రియులు. ధర్మరక్షణ, ప్రజారక్షణ క్షత్రియుల బాధ్యత. ఈ క్షత్రియవంశం సూర్యవంశరాజులు, చంద్రవంశరాజులు అనేరెండు విభాగాలతో వ్యవహరింపబడుతూ వస్తున్నది. సూర్యుని నుండి ఆరంభమయినది సూర్యవంశం. చంద్రునినుండి ఆరంభమయినది చంద్రవంశం.

చంద్రవంశరాజులలో చంద్రుని నుండి ఐదవ ఆయుఃపుత్రుడైన వాడే నహుషుడు. ఇతడు ధర్మమార్గాన్ని అవలంబించి ప్రజాపాలన గావిస్తూ తన తేజశ్శక్తిచే విశ్వవిఖ్యాతి నొందాడు. ఇంద్రియనిగ్రహముతో ఎన్నో సంవత్సరాలు తపమాచరించాడు. వందయాగాలు చేసి దేవతలను సంతృప్తి పరిచాడు. దేవతాప్రియుడయ్యాడు.

మన దేశంలోని పవిత్రనదులలో గంగానది ఒకటి. గంగానది మాత్రం కాదు. గంగాతీరం కూడ చాలా పవిత్రమైంది. మహర్షులకు ఆలవాలం. ఋషులకు తపోనిలయం. మునులకు విహారప్రదేశం. ఆ

పవిత్రనదిలో పుణ్యస్నానం చేసేవారు కొందరు. పాపపరిహారం చేసుకొనేవారు మరికొందరు. నదిలోమునిగి హఠంతో తపస్సు ఆచరించేవారు కొందరు. వారిలో చ్యవనమహర్షి ఒకడు.

## ఏమిటీ ఆశ్చర్యం?

చ్యవనమహర్షి తపస్సంపన్నుడు, సత్యవ్రతుడు, ధర్మవర్తనుడు, సహనశీలి, తేజస్వి. ఒకసారి ఇతరులకేసి చూస్తే వారి సర్వలక్షణాలను గ్రహించగల విశిష్టమూర్తి.

ఒకసారి చ్యవనుడు గంగలో మునిగి తపస్సు మొదలెట్టాడు. పన్నెండు ఏళ్లు గడిచాయి. అతని ఉనికిని ఎవరూ గుర్తింపలేకపోయారు. కాని ఒకసారి జాలరులు వృత్తిధర్మంతో వలవిసిరారు. కాసేపయ్యాక వల లాగారు. వల బరువుగా అనిపించింది. లాగడం కష్టమయింది. జాలరులు తమ పంట పండిందనుకున్నారు. ఏదో పెద్ద చేప వలలో పడిందను కున్నారు. కాని తీరా ఒడ్డుకు లాగేసరికి గడ్డం మీసాలున్న మనిషి ప్రాణాలతో ఊడిపడేసరికి ఖంగుతిన్నారు. అతణ్ణి తిన్నగా చూడలేక పోయారు. ఏదో అనర్థం తప్పదనుకున్నారు. కాసేపటికి తెప్పరిల్లారు. ఏం చేయాలో తోచక ఒకరికేసి మరొకరు చూసుకున్నారు. చివరకు ఈ వింతను రాజు చెవిని పడేయడమే మంచిదని కూడబలుక్కున్నారు. సరాసరి రాజాస్థానంకేసి కదిలారు. రాజును దర్శించి తమ దైన్యాన్ని ప్రకటించుకున్నారు.

## ప్రాణాలతో బయటపడ్డారు :

ఆ రాజు మరెవరో కాదు. నహుషచక్రవర్తి. చంద్రవంశీయుడు. ప్రభా - ఆయువుల సత్పుత్రుడు. ధర్మాత్ముడు. ప్రియంవదద్వారా

యతి, యయాతి, సంయాతి, యాయాతి ధ్రువులనే ఐదుగురు సత్పుత్రులను కన్నతండ్రి ఇతడు. ప్రజల కష్టాల్ని తన కష్టంగా భావించే సహృదయుడు. సామాన్యుల గోడును శ్రద్ధగా విని పరిష్కారం సూచించే న్యాయమూర్తి. అందుచేత నహుషుడు జాలరుల మొర విన్నాడు. ఆలోచనలో పడ్డాడు. వలలో పడిన వ్యక్తి సామాన్యుడు కాడని మనసు చెబుతూ ఉంది. అందుచేత మంత్రులతో సంప్రదించడం మంచిదనుకున్నాడు. మంత్రులు మహారాజుతో - ''మహారాజా! జాలరులు మనప్రజలు. వారిని రక్షించడం మన ధర్మం. వారు తెలిసి ఈ తప్పు చేయలేదు. వలలో పడ్డవ్యక్తి ఎవరో యోగికావచ్చు. తపశ్శక్తి సంపన్నుడు కావచ్చు. జాలరుల కాలం బాగుంది కనుక ప్రాణాలతో బయటపడ్డారు. కాకుంటే బూడిదయ్యేవారు. అందుచేత మనమందరం గంగాతీరానికి కదలడమే మంచిద''న్నారు.

**నాకు విలువకట్టు :**

జాలరులు, మంత్రులు, రాజు ససైన్యంగా గంగాతీరం చేరుకున్నారు. తపోనిష్ఠతో ఉన్న యోగిని దర్శించి ''యోగివర్యా ! మా ప్రజలు తెలియకచేసిన తప్పిదాన్ని క్షమించండి. ఈ రాజ్యపాలకునిగా నేను ప్రాధేయపడుతున్నా. మీ తపస్సుకు భంగం కలుగదు కదా!'' అని సాగిలబడ్డాడు. చ్యవనుడు కళ్ళుతెరిచాడు. చేతులు మోడ్చిన జనాన్ని చూశాడు. కళ్ళల్లో మెరుపు మెరిసింది. దరహాసం దోబూచులాడింది. మహారాజు సత్యనిష్ఠకు సహనశీలతకు సంతోషించాడు. మహారాజా! నిన్ను, నీప్రజల్ని మెచ్చుకుంటున్నా. ఇందులో జాలరుల తప్పేమీ లేదు. వారు తమ వృత్తిధర్మాన్ని నెరవేర్చారు. నాకేమాత్రం కోపం లేదు. కాకపోతే జాలరులు నిరాశాపరులయ్యారుకదా! అందుచేత నాకు విలువ కట్టి వారిని సంతోషపెట్టు అన్నాడు.

సమస్య పరిష్కారమయినందుకు రాజు సంతోషించాడు. జాలరులు చేపల్ని అమ్ముకొనేవారు కనుక డబ్బులిద్దామని అనుకున్నాడు. వేల మాడలిస్తానన్నాడు. చ్యవనుడు ఊరకున్నాడు. సరిపోదేమోనని కోటి మాడలిస్తానన్నాడు. చ్యవనుడు కదల్లేదు. ఒక వేళ రాజ్యమాశిస్తున్నాడేమోనని అర్ధరాజ్యమిస్తామన్నాడు. కాని మునిలో చలనం లేదు. నహుషునికి పట్టుదల హెచ్చింది. సామ్రాజ్యమంతా ఇస్తానన్నాడు. అయినా చ్యవనునిలో మార్పులేదు. నహుషుడు దిగాలు పడ్డాడు.

ఈలోగా కవిజాతుడనే ముని అక్కడికి వచ్చాడు. నహుషుడతనికి నమస్కరించాడు. ఈ విపత్కర పరిస్థితులలో పరిష్కారం సూచించవలసిందిగా ప్రార్థించాడు. అప్పుడా ముని దరహాసంతో మహారాజా! ఉత్తమబ్రాహ్మణులు సంపదలు కోరుకోరు. రాజ్యాలు కోరుకోరు. వారికి కావలసిందల్లా హోమాదికృత్యాలు నిర్విఘ్నంగా సాగడానికి సహాయపడే గోవులే. అందుచేత గోదానం చేయడం ఉచితం అన్నాడు.

నహుషుడు ఆలాగే చేశాడు.

చ్యవనుడు సంతృప్తుడయ్యాడు ''నీకు ఇంద్రపదవి దక్కుతుంది'' అని ఆశీర్వదించి వెళ్లాడు.

నహుషుడు రాజ్యపాలనచేస్తూ నూరు యాగాలు చేశాడు. దేవతలు మెచ్చుకున్నారు. మునులు సంతోషించారు. ప్రజలు పొగిడారు.

**తామరతూడులో......**

దేవేంద్రుడు స్వర్గానికి అధిపతి. అతని వజ్రాయుధానికి ఎదురులేదు. కాని ఒకసారి వృత్రుడు ఇంద్రునితో ఢీకొన్నాడు. ఇంద్రుడు

వృత్రాసురుణ్ణి సంహరించాడు. కాని బ్రహ్మహత్యాదోషం పట్టుకుంది. తాను స్వర్గాధిపత్యానికి అనర్హుడననుకొన్నాడు. ఆచూకి తెలియని సరస్సులో తామరతూడులో దాక్కొన్నాడు. స్వర్గాధిపతి లేక అమరావతి అతలాకుతలమయింది. అంతా అస్తవ్యస్తమయింది. ఆలనా పాలనా కరువయింది. అర్హులెవరూ ఆధిపత్యం స్వీకరించడానికి ముందడుగు వేయలేదు. స్వర్గాధిపత్యానికి తగిన బలవంతుడు యోగ్యుడు ఎవరా? అని ఆలోచించారు. మునులతో సంప్రదింపులు జరిపారు. చివరకు ఈవిపత్కర పరిస్థితులలో నహుషుడే తగిన వాడని నిర్ణయించారు. అందరు నహుషుని దగ్గరికి వెళ్లి అభ్యర్థించారు. తమ శక్తినంతా ఇస్తామన్నారు. నీవే తగినవాడవని పొగిడారు. ఇక నహుషునికి తిరస్కరించే ధైర్యం లేకపోయింది. సరే నన్నాడు. దేవతలు నహుషుని స్వర్గాధిపతిని చేశారు. కాలం గడిచింది.

## శచీదేవి ఎందుకు రాలేదు ?

స్వర్గాధిపత్యం స్వీకరించినవేళ నహుషుడు మంచివాడే. ధర్మాత్ముడే. కాని క్రమంగా నహుషునిలో మార్పు చోటు చేసుకుంది. గంధర్వులగానం మత్తెక్కించింది అప్సరసలతో విహారం కామాన్ని పెంచింది. పరిజనుల కైవారాలు గర్వితుణ్ణి చేశాయి. సరిగ్గా ఇదే సమయానికి శచీదేవి నహుషుని కంటబడింది. నహుషుడు ఆమెవైపు చూశాడు. అందరూ తన్ను సేవిస్తుంటే శచీదేవి ఎందుకు రావడంలేదని తనతోటివారిని ప్రశ్నించాడు. తన నివాసానికి రావలసిందిగా ఆజ్ఞ పురమాయించాడు.

## తోకతొక్కిన తాచులా . . . . .

శచీదేవి ఇంద్రుణ్ణి తప్ప మరొకరిని సేవించని ఇల్లాలు. నహుషుని

ఆనతో శచీదేవి డీలాపడిపోయింది. ఒకవైపు ఇంద్రుని అదృశ్యం మరోవైపు నహుషుని ఆదేశం. ఎటూ తోచక బృహస్పతితో తనగోడు వెళ్లబోసుకుంది. ''దేవగురూ! మీరు నా పతిదేవులైన దేవేంద్రునికి అత్యంత సన్నిహితులు. అమరావతీ క్షేమాన్ని సదా కాంక్షించే అమృతస్వరూపులు. దేవతల బాగోగులు పట్టించుకొనే సహృదయులు. పతిదేవుడు లేనివేళ మీరే పితృసమానులు. నన్ను సర్వదా సంరక్షించే సౌమ్యహృదయులు. పతి ఉన్నా నేడు గతిలేనిదాననయ్యాను. పైగా పతివ్రత అయిన నాపై పగవారి చూపు పడింది. నన్ను కాపాడడం, ఈ విపత్తు నుండి తప్పించడం మీ కర్తవ్యం. నేను మిమ్మల్ని శరణు వేడుకుంటున్నా''నంది.

బృహస్పతికి శచీదేవిఅంటే ఎంతో గౌరవం. శచీదేవితో ''త్వరలో నీకు ఇంద్రసమాగమం జరుగుతుం''దని భరోసా ఇచ్చాడు. శచీదేవి బృహస్పతిని కలుసుకోవడం విన్న నహుషుడు తోకత్రొక్కిన త్రాచులాలేచాడు. తన చుట్టూ ఉన్న దేవతలతో-

''ఇంద్రుడెవడు? వాడు పిరికిపంద! వంచకుడు. అహల్యా జారుడు. టక్కరి. గౌతముణ్ణి వంచించిన మోసగాడు. ఇంద్రాణి శచీదేవి రావలసిందే. సేవించవలసిందే. మీరయినా నచ్చచెప్పండి. కాకుంటే నేనే బలవంతం చేస్తాను'' అన్నాడు.

**శచిని అర్పించు!**

దేవతలు తల్లడిల్లారు. సమస్యను పరిష్కరిస్తామని అన్నారు. బృహస్పతి దగ్గరకు వెళ్లి ఇలా ప్రార్థించారు. దేవగురూ! శచీదేవి ప్రస్తుతం నీ అధీనంలో ఉంది. నీవేమో ఆమెకు అభయమిచ్చావు. కాని నహుషుడు శచీదేవిని కోరుతున్నాడు. నహుషుడు కోరడంలో తప్పులేదు.

దిక్కు_మొక్కు_ లేకపోతే మనమందరం ప్రార్థిస్తే స్వర్గాధిపతి అయిన వాడు ఆ నహుషుడు. అమరావతి సంపద అంతా అతనిదే. అందుచేత శచీదేవిని అర్పించు, ఇదే ధర్మం అన్నారు.

అప్పుడు బృహస్పతి ''దేవతలారా! నేను బ్రాహ్మణుణ్ణి. ఆడినమాట తప్పనివాణ్ణి. పైగా ఆశ్రయమిచ్చినవారిని రక్షించడం ధర్మం. ఇది శాస్త్రసంప్రదాయం. మీరు కోరినట్లు నేను శచీదేవిని నహుషునికి అప్పగించను'' అన్నాడు. దేవతలకేమిచేయాలో తోచలేదు. నహుషుని ఆజ్ఞలోను న్యాయముంది. బృహస్పతి మాటల్లోను నీతి ఉంది. నహుషుడు బలవంతుడు కనుక శచీదేవి సేవించడంలో తప్పేమీ లేదన్నారు. కాని బృహస్పతి ఒప్పుకోలేదు. అతడు దేవతలనుద్దేశించి ఈ విధంగా చెప్పాడు-'' ఓ దేవతలారా! ఇట్టి సందర్భాలలో శరణాగతరక్షణాన్ని గూర్చి బ్రహ్మ ఈ విధంగా ఉపదేశం చేశాడు. ఆ ఉపదేశం వినండి-''

**శరణాగతను రక్షించకపోతే....**

ఎవరు భయంతో శరణు కోరిన వారిని పరిత్యజిస్తాడో అతడు రక్షణ కోరినపుడు అతనికి రక్షకులెవ్వరూ ఉండరు. వర్షాకాలమైనా అతని భూముల్లో వర్షం పడదు. అతని పొలంలో విత్తనాలు నాటినా మొలకెత్తవు. అతడు హోమం చేసినా అతని హవ్యాన్ని దేవతలు స్వీకరింపరు. అతడు సంపాదించిన ధనమంతా వ్యర్థమవుతుంది. అతడు తిన్న అన్నం కూడ ఒంటబట్టదు. అతడు చేసే ప్రయత్నాలన్నీ వ్యర్థమవుతాయి. అతడు స్వర్గలోకభ్రష్టుడవుతాడు. అకాలంలో అతని సంతానం మరణిస్తుంది. అతని తల్లిదండ్రులు నరకంపాలు అవుతారు. ఈ ధార్మికవిషయాలన్నీ తెలిసినవాడిని కావున శచీదేవిని నహుషునకప్పగించను'' అన్నాడు.

## నాకు వ్యవధికావాలి :

పిమ్మట కళ్ళనీళ్ళు పెట్టుకున్న శచీదేవితో ''అమ్మా ఇంద్రాణీ! ఇంద్రుడు చెంతలేడని దిగులుపడకు. సర్వదా ఇంద్రునాశ్రయించిన మేమందరం ఉండగా బాధపడవద్దు. నీవు ఎప్పటికీ ఇంద్రాణివే. అచిరకాలంలోనే నీకు పతిసమాగమం సిద్ధిస్తుంది'' అని ఓదార్చాడు. దేవతలు శచీదేవితో సమాగమానికి వ్యవధికోరడం మంచిదని బృహస్పతి మాటగా చెప్పారు. శచీదేవి ఆలోచించింది. చివరకు తానే నహుషుని దగ్గరికి వెళ్ళి ''ఓ స్వర్గాధిపతీ! నేను పతివ్రతను. ఇంద్రునే పతిగా నమ్ముకున్నదాన్ని. నా పతి ఉనికి ఇందాకాతెలియదు. ఇటువంటి వేళ నిన్ను చేరడం సబబుకాదు. అందుచేత వ్యవధికావాలి అనుగ్రహించు'' అని నెమ్మదిగా పలికింది. నహుషుడు ఆలోచించాడు. ఇష్టం లేని వేళ స్త్రీ సమాగమంకంటే ఇష్టపడి వచ్చిన వేళ ఏలడం మంచిదని సరేనన్నాడు. బతుకు జీవుడా అంటూ శచీదేవి కదలింది.

## విష్ణుమూర్తితో విన్నపం :

దేవతలు, ఋషులు పాలకడలికి చేరారు. మహావిష్ణువును సందర్శించి తమ బాధలు విన్నవించుకున్నారు. దేవేంద్రుని అదృశ్యాన్ని విశదంగా చెప్పారు. శచీదేవికష్టాలను ఏకరువు పెట్టారు. విష్ణువు సాంతం శాంతంగా విన్నాడు. ''దేవతలారా! మీకు దిగులెందుకు. దేవేంద్రుడు క్షేమంగా ఉన్నాడు. నేను ఆదేశిస్తేనే ఇంద్రుడు వృత్రాసురుణ్ణి సంహరించాడు. నన్ను ఉద్దేశించి యాగాలు చేస్తే అతనికి బ్రహ్మహత్యాపాపం పోతుంది. అందువల్ల యాగాలు చేయండి. అతనికి మరల దేవేంద్రపదవి దక్కుతుంది. నహుషుడు అతని అకృత్యాల వల్లనే నశిస్తాడు'' అన్నాడు.

విష్ణువు ఆజ్ఞప్రకారం దేవతలు యాగాలు చేశారు. దేవేంద్రుని బ్రహ్మహత్యాదోషం నశించింది. దేవేంద్రుడు సంతోషంతో అమరావతి చేరాడు. అక్కడ నహుషుని చూశాడు. కాని అతని తేజస్సుముందు నిలువలేక పోయాడు. మరల పద్మవనంలో దాక్కున్నాడు. శచీదేవి దిగాలు పడ్డది. భర్త ఆచూకి తెలియక ఉపశ్రుతి అనే రాత్రిదేవతను ఆరాధించింది. ఆ దేవత సహాయంతో ఇంద్రుని వెదకుతూ తామరతూడులోని ఇంద్రుని చూచింది. దేవేంద్రుని పొగిడింది. తనకు వచ్చిన ఆపదల్ని ఏకరువు పెట్టింది. తననిర్ణయం తెలియచేసింది.

## సప్తర్షులు నీ పల్లకీ మోయాలి :

అప్పుడు దేవేంద్రుడు ''ఇంద్రాణీ! నహుషుడు బలసంపన్నుడు. నేను బలహీనుణ్ణి. కాలం కలసిరానివేళ విర్రవీగడం తగదు. పరాక్రమం కన్నా ఉపాయం మిన్న. అందుచేత నహుషునికి కబురంపు. దివ్యఋషులు వాహకులుగా పల్లకినెక్కి రమ్మని ఆదేశించు. ఉభయతారకంగా సాఫల్యమవుతుంది'' అన్నాడు. శచీదేవి సరేనంది. ''నహుషునిద్గరికి వెళ్ళి ఓస్వర్లోకాధిపతీ! దేవేంద్రునికి రథ గజతురగ వాహనాలు ఉన్నాయి. నీవు దేవేంద్రునికంటే గొప్పవాడవు. నీకు అపూర్వవాహనముండాలి. విష్ణువు, రుద్రుడు మొదలయిన దేవతలకంటే భిన్నమయిన వాహనం అమర్చుకో! సప్తర్షులు నీ పల్లకి మోయాలి. దేవగణం జేజేలు పలకాలి. అమరావతీ పురవీథుల్లో ఆనందంగా సంబరంగా సంతోషంతో ఊరేగాలి. నీ తేజస్సుకు, నీ గాంభీర్యానికి నీ త్రిలోకాధిపత్యానికి ఇదే తగిన నివాళి'' అంది.

నహుషుడు శచీదేవి మాటలకు ఉబ్బిపోయాడు. ''శచీదేవి! నీ సలహా చాలా బాగుంది. నేను సామాన్యుణ్ణి కాదు. త్రిలోకాధిపతిని.

నాకెదురులేదు. సప్తర్షులు నాకు అధీనులు. వారు పల్లకి మోస్తుండగా ఊరేగడంలోనే నాకు పరమ సంతృప్తి'' అన్నాడు.

## పద్మ సరోవరంలో ఇంద్రుడు:

బృహస్పతి దేవేంద్రునికోసం ముల్లోకాలు అన్వేషించాడు. కాని ఆచూకి తెలియలేదు. ఇంద్రునికి అగ్ని సన్నిహితుడని ప్రతీతి. అందుచేత బృహస్పతి అగ్నిదేవుణ్ణి ఆహ్వానించాడు. దేవేంద్రుని ఉనికిని కనుక్కోవలసిందిగా ఆదేశించాడు. అగ్ని సరేనన్నాడు. అతల సుతలాది లోకాలు వెదికాడు. ఇంద్రుడు కనబడలేదు. చివరకు బృహస్పతితో ''దేవగురూ ! ఇంద్రుడు ఎక్కడ దాగివున్నాడో తెలియదు. నా ప్రయత్నం వ్యర్థమయింది. ఒక్క జలప్రదేశంలో తప్ప అన్నిచోట్లా వెదికాను''. అని ఆవేదనతో బదులిచ్చాడు. కాని బృహస్పతి ఆ సమాధానంతో సంతృప్తి పడలేదు. ''ఓ హవ్యవాహనా! ''నీవు సామాన్యుడివి కావు. నీవు మేఘుడివి. విద్యుత్తువి. నీ జ్వాలలు ప్రాణికోటిని కాల్చేస్తాయి. నీవు లేని స్థలం లేదు. అందుచేత జలప్రదేశంలో కూడ దేవేంద్రుని అన్వేషించు! '' అన్నాడు. అగ్ని అలాగే అన్వేషించాడు. చివరకు పద్మసరోవరంలో పద్మనాళంలో దాగిన ఇంద్రుని గుర్తించాడు. బృహస్పతి కూడ అక్కడకు వచ్చాడు. బృహస్పతి ఇంద్ర సందర్శనంతో తబ్బిబ్బయ్యాడు.

## ఎదురుదెబ్బ తీద్దాం !

''దేవాధినాథా! నా తపస్సు ఫలించింది. నా అన్వేషణ సఫల-మయింది. దేవతల దుఃఖం నశించింది. శచీదేవి ప్రాణాలకు ముప్పు తొలగింది. నీవు విశిష్టుడివి. విష్ణుమూర్తి ఆదేశంతో వృత్రాసురుని సంహరించావు. నీవు సర్వప్రాణికోటికి ఆధారభూతుడివి. అయినా

ఈనాడు దేవతలపాట్లు చెప్పరానివి. దేవతలంతా నహుషబాధాపీడితులై ఉన్నారు. అతని దృష్టిలో విషమున్నది. అందుచేత దేవతలందరు అతనికెదురుగా నిలువలేకున్నారు'' అని ప్రార్థించాడు. అప్పుడు దేవేంద్రుడు కాసేపు ఆలోచించాడు. ''దేవతలారా! మీరింక భయపడనక్కరలేదు. నేనున్నాను. మీరు నిగూఢరూపులు కానక్కర లేదు. సహజరూపంతో మీమీ ఆధిపత్యాన్ని చెలాయించండి. అగ్నిదేవా! నీకు యజ్ఞభాగం ఇస్తున్నాను. వరుణదేవా! జలాధిపతివి కమ్ము. యముడా! నీవు పితృలోకాధిపతివి కమ్ము'' అని శాసించాడు. సమయం చూచి ఎదురుదెబ్బ తీద్దామన్నాడు.

**నహుషుని పదవీచ్యుతి :**

దేవేంద్రుడు దేవతలతో మంతనాలాడుతుంటే అగస్త్యమహర్షి అక్కడికి వచ్చాడు. నహుషపతనవృత్తాంతం చెప్పాడు.

నహుషుడు దురాత్ముడు. గర్వాంధుడు. ఉచ్చనీచాలు తెలియనివాడు. అందుచేత తనపంతం నెరవేర్చుకోవాలనుకున్నాడు. శచీదేవి ప్రలోభం అతణ్ణి తికమకపెట్టింది. తన ఆధిపత్యం నిలబెట్టుకోవాలని పురమాయించింది. సప్తర్షుల్ని పిలిపించాడు. తన కోరికను బయట పెట్టాడు. సప్తర్షులు మౌనవ్రతం పూనారు. చేసేదేమీ లేక పల్లకి మోశారు. అలవాటు లేనిపని. అలసిపోయారు. కాని అగస్త్యుడు అలసిపోలేదు. నహుషునితో వాదానికి దిగాడు.

''ఓ స్వర్గాధిపతీ! బ్రహ్మప్రోక్తమయిన గోపూజాప్రోక్షణ మంత్రం గురించి మీ అభిప్రాయమేమి''టని ప్రశ్నించాడు. ''మహర్షీ! నేను వేదమంత్రాలను ప్రమాణంగా స్వీకరించను'' అని దురుసుగా జవాబిచ్చాడు. మహర్షులు నహుషునితో ''స్వర్గాధిపతీ! వేదాలు

అపౌరుషేయాలు. వేదమంత్రం పరమపవిత్రం. వేదవిజ్ఞానం అనంతం. సమస్తలోకాలకూ సర్వజనులకూ ఆరాధ్యం. మతాలకు ఆయువుపట్టు వేదాలు. అలాంటి వేదాలను, వేదమంత్రాలను అప్రామాణికమనడం మూర్ఖుల వాదమేకాక మరేమీ కాదు. స్వర్గాధిపతిగా ఉండి, అనేక యాగాలు చేసి పుణ్యపరిపాకంవల్ల సమున్నతులైన మీనోట ఈమాట వినడం ఆశ్చర్యంగా ఉంది'' అన్నారు.

నహుషుడు ఈ మాటలతో రెచ్చిపోయాడు. వితండవాదానికి దిగాడు. వాదప్రతివాదాలు సాగుతుంటే చివరకు నహుషుడు కోపంతో తన పాదంతో అగస్త్యుణ్ణి తన్నాడు.

**సర్పంగా పడిఉండు!**

అగస్త్యుడు ఆలోచించాడు. నహుషుని గర్వమణచ దలచుకున్నాడు. నహుషునితో ''ఓ నహుషా! నీవు దురాత్ముడివి. గర్విష్టివి. యుక్తాయుక్తాలు మరచినవాడివి. అధికారగర్వంతో విర్రవీగేవాడివి. నీ చేతలు మంచివి కావు. ఋషులచేత ఎప్పుడు పల్లకిని మోయించావో ఆనాడే నీ పుణ్యమంతా నశించింది. సర్పంలా బుసకొడుతూ సప్తర్షుల్ని చీదరించుకున్నావు. అందుచేత పదివేల సంవత్సరాలు సర్పంగా పడివుంటావు. నా శాపానికి తిరుగులే''దని శపించాడు. శాపమవడంతో నహుషుడు చతికిలపడ్డాడు. తన అహంకారమే కాటువేసిందని అర్థం చేసుకున్నాడు. అగస్త్యుని పాదాలపై పడి క్షమించమన్నాడు. మహాత్ముల కోపాలు గడ్డిమంటలు కదా! నహుషుని పూర్వ పుణ్యకర్మల్ని, ఇంద్రుడులేని వేళ స్వర్గాన్ని పాలించిన వైనాన్ని తలచుకొని అగస్త్యుడు ''నహుషా! నీవు సర్పరూపంలో జీవించక తప్పదు. కాని నీకు పూర్వజ్ఞానం ఉంటుంది. ఎవరయితే నీప్రశ్నలకు జవాబిస్తారో

ఆనాడే నీకు శాపవిముక్తి'' అంటూ అనుగ్రహించాడు. ఆనాటినుండి నహుషుడు సర్పరూపంలో ద్వైతవనంలో తిరుగుతున్నాడు, అంటూ అగస్త్యుడు నహుషుని పదవీచ్యుతిని దేవేంద్రునకు వివరించాడు. అంతేకాకుండా ''దేవేంద్రా! ఇంకనీవు అదృశ్యుడవై ఉండనవసరంలేదు. వృత్రుని సంహరించి విఖ్యాతి పొందావు. మహర్షుల మనస్సుల చూరగొన్నావు. నీ కోసం శచీదేవి వేచిఉంది. వెంటనే స్వర్గాధిపత్యం స్వీకరించు''మని ఆదేశించాడు. దేవేంద్రుడు మహర్షుల ఆదేశానుసారం స్వర్గాధిపత్యం స్వీకరించాడు.

## నన్నెందుకిలా బంధించావు?

ఏ భూలోకంలో అయితే ధర్మవర్తనుడుగా రాణించాడో, చ్యవనమహర్షి ఆశీస్సులు పొందాడో, ఏ లోకంలో నూరు యాగాలు చేశాడో ఆ భూలోకంలో నిర్జనారణ్యంలో సర్పాకారంతో మసలసాగాడు నహుషుడు. తనకు విముక్తి కలగకపోతుందా అంటూ కనబడిన వారిని తన బంధంలోకి లాక్కొని ప్రశ్నపరంపరలు కురిపించేవాడు కాని ఫలితం శూన్యం. పదివేల సంవత్సరాలు గడిచాయి.

.పాండవుల అరణ్యావాసం చేస్తున్నకాలమది. వారు గంధమాదన పర్వతాన్ని దాటి ద్వైతవనంలో ప్రవేశించారు. ఆప్రాంతంలో సంచరిస్తున్నాడు భీముడు. సర్పరూపంలోనున్న నహుషుడు అతని బాహువులను తన తోకతో బంధించాడు. సహస్రగజాల భుజబలంగలవాడైనా భీముడు అగస్త్యవరబలం ఉండే సర్పబంధాన్నుండి తప్పించుకోలేకపోయాడు. చేసేదిలేక ఆ సర్పంతో ''నీ వెవరు? నన్నెందుకిలా బంధించావు. నేను పాండుపుత్రుణ్ణి. ధర్మరాజసహోదరుణ్ణి. బకాసురాది రాక్షసులను సంహరించినవాణ్ణి. పదివేల గజాల బలం

కలవాణ్ణి. నా బాహుబలం ముందు ప్రతివాడూ పరాజితుడు కావలసిందే. అయినా నీకు పట్టు బడ్డాను. ఇది నీ విద్యాబలమా? లేదా వరబలమా? వీరునిగా నిన్ను మెచ్చుకుంటున్నా. పరాక్రమంముందు తలవంచుతున్నా. సాహసం ముందు మోకరిల్లుతున్నా. నీవెవరవు?'' అని గద్దించి అడిగాడు. నహుషుడు తన కథనంతా వినిపించాడు.

ఈలోగా భీముడెంతసేపు రాకపోయేసరికి ధర్మరాజు వెతుక్కుంటూ వచ్చాడు. చీకటిగుహలో పాముతో చుట్టబడిన భీముణ్ణి చూచాడు. ఎంతో బలవంతుడయిన భీముడు సామాన్యుడిలా బంధింప బడడం చూచి ఆశ్చర్యపోయాడు. తన తమ్ముణ్ణి వదలిపెట్టవలసిందిగా ప్రార్థించాడు. అపుడు నహుషుడు ''ధర్మరాజా! నేను భీముణ్ణి వదలను. నా ప్రశ్నలకు సమాధానం చెప్పాలి. అపుడే విముక్తి'' అన్నాడు. ధర్మరాజు సరేనన్నాడు.

''బ్రాహ్మణుడంటే ఎవరు? బ్రాహ్మణుడు తెలుసుకోవలసిన తత్త్వమేమిటో విశదంగా చెప్పు'' మని నహుషుడు కోరాడు.

''బ్రాహ్మణుడంటే కులంబట్టి పుట్టిన బ్రాహ్మణుడు కాడు. సత్యపాలన, దానగుణం, ఓర్పు, సౌశీల్యం, క్రౌర్యం లేకపోవడం, తపస్సు, దయాదిసద్గుణాలు ఎవరిలో ఉంటాయో వాడే బ్రాహ్మణుడు. అతడు తెలుసుకోవలసిన తత్త్వం పరబ్రహ్మ తత్త్వం. మహాత్మా! ఈ గుణాలు తశూద్రులలో ఉన్నా అతడు బ్రాహ్మణుడు. ఈ గుణాలు బ్రాహ్మణకులంలో పుట్టినవారిలో లేకపోతే అతడు బ్రాహ్మణుడు కాడు. అతడు శూద్రుడు'' అని ధర్మరాజు జవాబిచ్చాడు.

ఈ మాటలన్నీ నహుషుడు విన్నాడు. ధర్మరాజుయొక్క శాస్త్రపరిజ్ఞానాన్ని ధర్మాధర్మనిర్ణయంలో అతని వివేచనాశక్తిని

తెలుసుకున్నాడు. అందుచేత ''నీ సోదరుని నేను భుజింపను. నా ప్రశ్నల కన్నింటికీ సంతృప్తికరంగా చక్కగా సమాధానమిచ్చావ'' ని సంతోషంతో పలికాడు. అప్పుడు యుధిష్ఠిరుడు నహుషుని ప్రజ్ఞాపాటవాన్ని గుర్తించి తనకున్న ధర్మసందేహాలను నహుషునిద్వారా నివృత్తి చేసుకోవాలని అతనిని ఇలా కొన్ని ప్రశ్నలడిగాడు. ''ఓ మహాత్మా! మీరు సర్వవేద వేదాంగ పారగులు. ఏకర్మనాచరిస్తే సద్గతి కల్గుతుందో తెలియజేయండి.''

**నహుషుడు** : సత్పాత్రదానం, సత్యప్రియభాషణం, అహింస, ధర్మతత్పరత అనే గుణాలచే మానవుడు స్వర్గాన్ని పొందుతాడు.

**యుధిష్ఠిరుడు** : సత్యదానాలలో, అహింసా, ప్రియభాషణాలలో ఏది గొప్పది?

**నహుషుడు** : ధర్మజా! సత్యదానాలలో, అహింసా ప్రియ భాషణాలలో పెద్దా చిన్నా తేడాల నిర్ణయం కార్యమహత్వాన్నిబట్టి నిర్ణయింపవలసియుంటుంది. కొన్ని సందర్భాలలో దానంకంటే సత్యం గొప్పదిగా, మరికొన్ని సందర్భాలలో సత్యం కంటే దానం గొప్పదిగా కనబడుతుంది. ఇట్లే అహింసా ప్రియభాషణాలు కూడ కనబడతాయి. పెద్దా చిన్నా తేడాల నిర్ణయం కార్యాపేక్షనుబట్టియే జరుగుతుంటుంది.

**యుధిష్ఠిరుడు** : మానవునికి స్వర్గప్రాప్తి, ఎలా కల్గుతుంది? కర్మలకు నిశ్చయరూపంతో లభించే ఫలమెట్లా కనబడుతుంది? దేహాభి మానం లేని పురుషుని గతి ఎలాగుంటుంది?

**నహుషుడు** : ప్రాణులకు కర్మానుసారంగా స్వర్గప్రాప్తి, మానవాది జన్మ, నరకప్రాప్తి అనే మూడుగతులుంటాయి.

మానవుడుగా పుట్టినపుడు ఆలస్య, మదగుణాలను వదలి అహింసను పాటిస్తూ, శుభ కర్మలను ఆచరిస్తూ ఉంటే

పుణ్యకర్మానుసారం స్వర్గలోకప్రాప్తి కల్గుతుంది. దీనికి విపరీతంగా ఆచరిస్తే కామక్రోధ లోభాదులచే హింసాతత్పరుడై మానవతాభ్రష్టుడయి పశుపక్ష్యాది జన్మలను పొందుతాడు. సత్కర్మలాచరిస్తే మరలా ఆపశుపక్ష్యాది జన్మల నుండి మానవజన్మ పొందుతాడు. గవాదుల్లో అశ్వాదుల్లో మరలా మానవజన్మను పొందిన దృష్టాంతాలు ఎన్నో కనబడతాయి. తన కర్మఫలాన్ని బట్టి మానవుడిలా మూడుగతులలో పరిభ్రమిస్తూ ఉంటాడు. కర్మఫలాన్ని కోరే జీవుడు పరవశుడయి అనేక జన్మలెత్తుతూ సుఖ దుఃఖ భోగాలననుభవిస్తూ ఉంటాడు. కర్మఫలాసక్తి లేని బ్రాహ్మణుడు లోకకల్యాణ భావంతో నిత్యం తన ఆత్మను పరబ్రహ్మయందే నిల్పగల్గుతాడు.

**యుధిష్ఠిరుడు** : రూప రస గంధ శబ్ద స్పర్శలకు మూలాధార మేమిటి? మన మనస్సు విషయాలన్నింటిని ఒకేసారి ఎందులకు గ్రహింపదు?

**నహుషుడు** : ఆత్మ ద్రవ్యం స్థూల, సూక్ష్మ కారణ శరీరాల నాశ్రయించి విధిపూర్వకంగా అనేక భోగాలననుభవిస్తూ ఉంటుంది. జ్ఞానం, బుద్ధి, మనస్సు అనే మూడు శరీరంలో ఆత్మయొక్క భోగాధికరణాలు. పంచేంద్రియ విషయాలకాధారభూతమయి, పంచభూతాలచే నిర్మితమయిన శరీరంలోని జీవాత్మ ఈ శరీరములోని మనస్సుద్వారా క్రమంగా పంచేంద్రియ విషయాలను అనుభవిస్తూ ఉంటుంది.

ఓ నరశ్రేష్ఠా! విషయసుఖాలననుభవించే సమయంలో ఈ జీవాత్మ మనస్సు ఏదో ఒక విషయమునే నియంత్రితమయి ఉంటుంది. అందువల్లనే ఒకేసారి అన్ని ఇంద్రియాలద్వారా అన్ని విషయాలను గ్రహింపలేకపోతున్నాడు. ఈ ఆత్మరెండు కనుబొమ్మల మధ్యనుండి ఉత్తమ - అధమ బుద్ధిని భిన్న భిన్న ద్రవ్యాలపయి ప్రేరేపిస్తూ ఉంటుంది. బుద్ధిక్రియోత్తరకాలంలోనే విద్వాంసుడయిన పురుషుడు ఒక

అనుభూతిని పొందుతుంటాడు. క్షేత్రజ్ఞుడయిన ఆత్మను ప్రకాశింపజేసే భావనావిధి ఇదియే.

**యుధిష్ఠిరుడు** : మహాత్మా! తత్త్వవేత్తలు తెలుసుకోదగిన మనో బుద్ధిలక్షణాలను తెలియజేయండి.

**నహుషుడు** : ఆత్మభోగం, మోక్షసంపాదనం అనేవి బుద్ధి ప్రయోజనాలు. ఈ బుద్ధి ఆత్మనాశ్రయించి విషయాలపై లగ్నవౌతుంది. ఈ కారణాలచే '' ఆత్మానుసారిణీ బుద్ధిః'' అని పేర్కొన్నారు. ఈ బుద్ధి ఆత్మయొక్క చేతనాశక్తి సంబంధంతో ఉంటుంది. అలా బుద్ధియొక్క గుణవిధానంవల్లనే అనగా దాని జ్ఞానశక్తిప్రభావంచే మనస్సు ఆ గుణ సంపన్నమవుతుంది. ఇంద్రియవిషయాలను గ్రహించడంలో కూడా సమర్థమవుతుంది. అందుచేత బుద్ధి కార్యారంభం తోడనే ప్రకటమవుతుంది. మనస్సు ఎల్లప్పుడు కూడ తెలియబడుతూ ప్రకటంగానే ఉంటుంది. కార్యాన్ని చూచినపుడే కారణసత్త వ్యక్తమవుతుంది. బుద్ధియొక్క గుణవిధానంచేతనే మనస్సు ఆగుణాన్ని కలిగి ఉంటుంది. ఇది శాస్త్రసమ్మతం. మనో బుద్ధుల విశేషభేదమిదియే.

**యుధిష్ఠిరుడు** : మహాత్మా! మీరు సర్వజ్ఞులైనా అనేక ప్రశ్నలడిగారు. అనేక అద్భుత కర్మలనాచరించారు. అలాంటి మీకు స్వర్గచ్యుతి కారణమయిన మోహమెలా కలిగిందో తెలియజేయండి.

**నహుషుడు** : రాజా! ఈ ధనసంపద ఎంతటి శూర వీరులనయినా, మహాబుద్ధిమంతులనయినా మోహపరవశులను చేస్తుంది. సుఖ విలాసాలలో మునిగేవారందరు మోహితులవుతారని నా విశ్వాసం. నేను ఐశ్వర్యమదమత్తుడనయి పతితుడనయ్యాను. ప్రస్తుతం జ్ఞానోదయం కలిగి నీకు ప్రభోధం చేస్తున్నాను. నీవు నాకొక గొప్ప ఉపకారం చేశావు. ఉత్తమోత్తముడవైన నీతో సంభాషణంతో నా కష్టాలన్నీ తొలగిపోయాయి.

నాకు శాపవిమోచనం కలిగింది. పూర్వం దివ్యవిమానంలో సంచరించే నేను అహంకారదర్పంతో ఎవ్వరిని లెక్కచేయలేదు. బ్రహ్మర్షులు, దేవగణం, త్రిలోకవాసులంతా నాకు దాసులయి ఉండేవారు. దర్శనమాత్రంచేతనే ఎవరి తేజస్సునయినా హరించే శక్తి నాకుండేది. సహస్ర బ్రహ్మర్షిగణంచే నేనధిరోహించిన పల్లకిని మోయించిన కారణంగా అగస్త్య మహర్షిచే శపింపబడ్డాను. సర్పమయ్యాను. పశ్చాత్తాపంతో భూలోకంలో పడుతూ దయామయుడైన ఆమహర్షిని క్షమించమని ప్రార్థించాను. అగస్త్యమహర్షి నేను చేసిన తప్పును క్షమించాడు. ధర్మరాజు నిన్ను శాపవిముక్తుని చేస్తాడని, పాపఫలం క్షీణించగానే నీవు మరల స్వర్గలోకాన్ని పొందుతావని అనుగ్రహించాడు.

ఆసమయంలో బ్రహ్మర్షుల బ్రహ్మజ్ఞానాన్ని, బ్రాహ్మణత్వాన్ని తపోబలాన్ని చూచిన తరువాత నాకు గొప్ప ఆశ్చర్యం కలిగింది. అందువల్లనే ఈ విషయాలన్నిటిని గూర్చి నిన్ను ప్రశ్నించాను. ఓ రాజా! సత్యం, దమం, తపస్సు, దానం, అహింస, ధర్మపరాయణత ఈ సద్గుణాలన్నీ మానవులకు సిద్ధిని కలుగజేస్తాయి. మహాబలుడయిన నీసోదరుని భీమసేనుని స్వీకరించండి. మీకు శుభమగుగాక! నేను మరలా స్వర్గానికి వెడుతున్నానని నహుషుడు పలికాడు. స్వేచ్ఛానుసారం కోరిన చోటికి తీసుకొనివెళ్ళే దివ్యవిమానం మహావేగంతో అచ్చటికి వచ్చింది. ధర్మరాజు ఆ దృశ్యాన్ని చూస్తూనే ఉన్నాడు. నహుషుడు సర్పశరీరాన్ని వదిలాడు. మహోజ్జ్వలమయిన పూర్వరూపాన్ని ధరించాడు. ధర్మరాజుకు అనేకవిధాలుగా తన కృతజ్ఞతలను తెలియజేశాడు. అతని ఉపకారాన్ని ప్రశంసిస్తూ దివ్యవిమానాన్ని అధిరోహించాడు. ఆ విమానం మహావేగంతో రివ్వున పైకెగిసి స్వర్గలోకాన్ని చేరింది.

*ఓం శాంతిః శాంతిః శాంతిః*

❀ ❀ ❀

